హరిః ఓమ్

# శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర భాష్యము

శ్రీశ్రీ 1008 శ్రీశ్రీ సత్యసంధ తీర్థ యతీంద్రకృత సంస్కృత భాష్యమునకు

ఆంధ్రీకరణము



ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।

త్రీన్‌లోకాన్‌వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః

ఆంధ్రానువాద కర్త : డా॥ చేరాల వేంకట లక్ష్మీనరసింహారావు



శ్రీ దిగ్విజయ రాముల వారు, శ్రీ మూల రాముల వారు,
శ్రీ సీత అమ్మవారు, శ్రీ వంశ రాముల వారు,
శ్రీ విరల రాముల వారు,
శ్రీ వేదవ్యాస దత్తమైన వ్యాసముష్టికలు
మరియు కూర్మసాలగ్రామం



శ్రీశ్రీ 1008 శ్రీశ్రీ సత్యసంధ తీర్థ శ్రీ పాదుల వారి
మూల బృందావనం, మహిషి

హరిఃఓమ్

# శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర భాష్యము

## శ్రీశ్రీ 1008 శ్రీ సత్య సంధ తీర్థ యతీంద్రకృత సంస్కృత భాష్యమునకు ఆంధ్రీకరణము (మూల భాష్య సహితము)



ఆంధ్రానువాద కర్త :

**డా॥ చేరాల వేంకట లక్ష్మీ నరసింహారావు**

ప్రచురణ :

**శ్రీ లక్ష్మీ హయగ్రీవ ఛారిటబుల్ ట్రస్టు**, రి.నెం.102/2017

**చీరాల** (ప్రకాశం జిల్లా, ఆం.ప్ర)

ప్రథమ ముద్రణ
దుర్ముఖి నామ సంవత్సర
కార్తీక శుద్ధ అష్టమి
8-11-2016

మూల్యము : రూ.280/-లు
(పోస్టేజితో కలిపి)
Sri Lakshmihayagreeva Charitable Trust,
Andhra Bank, Gavinivanipalem Branch
CHIRALA.
**Account No. 016510100086168**
**IFSC Code : ANDB0000165**
పై ఎకౌంటుకు జమచేయగలరు.

ప్రతులకు :
**శ్రీ లక్ష్మీహయగ్రీవ చారిటబుల్ ట్రస్టు**
3-92-1, శ్రీ లక్ష్మీహయగ్రీవ బృందావనం
I.L.T.D. కాలనీ, కొత్తపేట
చీరాల
**సెల్: 9849806827, 9394332849**

ముద్రణ : పద్మశ్రీ ప్రింటర్సు
మచిలీపట్నం

॥ శ్రీదిగ్విజయరామో విజయతే ॥
శ్రీమజ్జగద్గురు శ్రీమధ్వాచార్య మూలమహాసంస్థానము,
శ్రీమదుత్తరాదిమఠాధీశులైన
శ్రీ1008 శ్రీ సత్యాత్మతీర్థశ్రీపాదులవారి
అనుగ్రహసందేశము

య ఇదం శ్రుణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోముత్రేహ చ మానవః ॥

సహస్ర సహస్ర సహస్రనామములున్నాయి. కానీ సహస్రనామం అనగానే నాకలోకం నుండి నరలోకం వరకు అందరి మనసులోనూ విష్ణుసహస్రనామమే గోచరమవుతుంది. అంతటి మహిమ గలది శ్రీవిష్ణుసహస్రనామం. అనన్యసాధారణమైన స్తోత్రం శ్రీవిష్ణుసహస్రనామం.

సకలదురితవినాశకమైన శస్త్రమే శ్రీవిష్ణుసహస్రనామం. అత్యంతభవ్యమైన అలౌకికమైన భారతీయుల వాఙ్మయంలో తలమానికంలా శోభాయమానమైనది ఈ స్తోత్రమే.

భగవంతుని బాంధవ్యమును, సౌహార్దమును సంపాదించుకున్న ధన్యజీవి ధర్మరాజు. ధర్మయుద్ధం జయప్రదంగా ముక్తాయమైన తరువాత ధర్మరాజుయొక్క ధర్మజిజ్ఞాసకు అనుగుణంగా పరమశాంతుడైన శాంతనవుడైన భీష్ముడు ఉపదేశించిన దివ్య సహస్రనామం శ్రీవిష్ణుసహస్రనామం.

భగవంతుని నామమహిమకు అంతులేదు. భగవంతుని నామమునకు సరిసాటియైన మరో పదార్థం విశాలమైన ఈ విశ్వంలో మరోటి లేదు. దానికి అదే సాటి. ఈ విష్ణుసహస్రనామమును పారాయణం చేయడం వలన లౌకిక-పారలౌకిక ప్రయోజనములు క్షణంలోనే నెరవేరుతాయి. అందరి అశుభములు దూరమవుతాయి. అత్యంత అశుభమైన సంసారం సమూలంగా నష్టమవుతుంది. ఇలా క్రమముగా ముక్తిని సంపాదించిపెడుతుంది. కురుకుల పితామహుడైన భీష్మాచార్యుడు మొదలైన మహామనీషుల అనుభవోక్తి ఇది.

అర్థజ్ఞానపూర్వకముగా విష్ణుసహస్రనామమును పారాయణం చేయడం వలన సర్వత్ర సదా అవిజ్ఞాతమిత్రుడైన భగవంతునియందు అనన్యమైన భక్తి అభివృద్ధమవుతుంది. అనన్యమైన భక్తిని సంపాదించిన వారికి అలభ్యమైనది ప్రపంచములోనే లేదు. వారి సకలాభీష్టములు సంపన్నమవుతాయి.

ఇటువంటి సర్వోత్తమస్తోత్రమైన విష్ణుసహస్రనామమునకు అద్భుతమైన వ్యాఖ్యానమును శ్రీసత్యసంధతీర్థులవారు రచించినారు. పవిత్రమైన ఆశ్రమమును సంపాదించుకున్నవారు శ్రీసత్యసంధులు. అప్పటి తెలంగాణ, ఆంధ్రప్రాంతములు విశేషముగా సంచారం చేసి, అప్పటి భక్తులను ఉద్ధరించిన మహానుభావులు శ్రీసత్యసంధతీర్థులు. అటువంటి మహనీయచరితులు రచించిన సహస్రనామ వ్యాఖ్యానమును, ఆ అర్థవైభవమును తెలుగువారికి అందించాలనే సదుద్దేశ్యంతో మా తమ్ములైన శ్రీ చేరాల వేంకట లక్ష్మీ నరసింహారావుగారు పరిశ్రమతో చాలా చక్కగా, అందముగా తెలుగు భాషలో అనువదించినారు. తెలుగువారందరికీ ఈ కృతి ఉపయోగపడాలని చేరాల వాస్తవ్యులు, కీ॥శే॥ శ్రీ [illegible] ముఖ్యప్రాణరావుగారి పుత్రులు శ్రీ రాఘవేంద్రరావుగారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు. వారికి మరియు శ్రీయుత చేరాల నరసింహారావుగారికి అస్మదుపాస్యులైన శ్రీమూలరామ-దిగ్విజయరామ-వేదవ్యాసులు విశేషముగా అనుగ్రహించాలని, మరిన్ని ధార్మికకార్యములను చేసే సామర్థ్యమును ఇచ్చి కరుణించాలని ప్రార్థించుచున్నాము.

ఇతి శ్రీమన్నారాయణస్మరణములు

[illegible]

శ్రీసత్యాత్మతీర్థశ్రీపాదరు

ఉత్తరాదిమఠం, బెంగళూరు